సంపుటము 5] ఫిబ్రవరి, 1919 [సంచిక 8

# బాలమిత్ర

## గాడిద పాట

పార్సిమట్టు

పల్లవి

చాలా మాసిన గుడ్డ లేలాగు
చాకలి గాడిదపై మోపెను
బాలరో కనుమేమి పాపము నాకు కడు
జాలి వేసెడు నహాహా. ॥ చాల ॥

1. విసుకదు తసుకదు కసవు
హాసింపదు గార్ధభ మహాహాహా
వెసగట్టి మునిగాళ్లు విడిచిన గాని యుఁ
కసిలేక పాటు పడున్. ॥ చాల ॥

2 ఆకులు నలములు
కాకితముల్ నమలి ఆకలి తీర్చుకొనుఁ
నా కిది యిడుమని చాకలి నెంతయు
చీకాకు నిడుకుండునో. ॥ చాల ॥

# చెడ్డ బాలుడు

పూర్ణానందము చెడ్డ బాలుడు; వాడు ఇంట నిలువడు వీధి వీధి, తిరుగును. దుష్టబాలురే వానికి స్నేహితులు. వాడు ఎప్పుడును ఆడుకొనుచుండును.

2. పూర్ణానందమునకు మఱియొక చెడ్డ గుణముకూడ గలదు. వీధిలో పోవునట్టి మనుష్యులను ఎగతాళిచేయును; నోటికివచ్చినట్లు తిట్టును; జగడమునకు పిలుచును. కాబట్టి అందఱును వానికి భయపడుదురు. "దుష్టుని చూచిన దూరముగ తొలగుము" అని చెప్పుదురు కదా.

3. పూర్ణానందము ఒక దినము తన వాడుకచొప్పున వీధిలో ఆడుకొనుచుండెను. ఆ మార్గమున ఒక వృద్ధుడు వచ్చెను. పూర్ణానందము అతనిని చూచి ఎగతాళిచేసెను. అతడు యేమియు చెప్పలేదు. పిమ్మట పూర్ణానందము అతనిని వెంబడించి తిట్టుచుపోయెను. అప్పుడు వృద్ధుడు అచ్చటనే నిలిచి పూర్ణానందమును ప్రీతితో పిలిచెను. వాడు అతని యొద్దకుపోయెను.

4. వృద్ధుడు పూర్ణానందమును చూచి, అబ్బాయీ! నీవు మిగుల మంచివాడవుగా ఉన్నావు. నీవు చెప్పిన మాటలు విని

చాల సంతోషమైనది. నీకు మంచి బహుమతి చేయుచుందు. అయిన నిప్పుడేమియును లేదు. ఇదిగో నాయొద్ద నిప్పుడొక కానియే యున్నది. దీనిని తీసికొనుము. నా వెనుక ఒకరు వచ్చుచున్నారు చూడుము. వారినికూడ యీలాగుననే తిట్టుము. నీకు తగిన బహుమతి చేయుదురు, అని ఆ కానిని వాని చేతికిచ్చి పోయెను.

5. పిమ్మట ఆ వృద్ధుడు చెప్పిన మనుష్యుడు వచ్చునంత దాక అచ్చటనే వాడు నిలువబడియుండెను. ఆ మనుష్యుడు మిక్కిలి మూర్ఖుడు, ముంగోపి; అతడు దగ్గరకు రాగానే పూర్ణానందము మునుపటికంటె నధికముగా తిట్టెను. దాని వలన, ఆ మనుష్యునికి మిక్కిలి కోపము వచ్చెను. కనుక వాడు పిల్లవానిచేతులను గట్టిగా పట్టుకొని చెంప పగులునట్లు ఒక్క దెబ్బ గొట్టెను.

6. పూర్ణానందము ఆ దెబ్బకు తాళలేక ఏడ్చెను. వాడు ఏడ్చుచునే తిట్టుటకు మొదలుపెట్టెను. అంతట ఆ మనుష్యుడు పిల్లవానిని యింకను అధికముగా కొట్టెను. దెబ్బమీదదెబ్బ పడగానే బాలునికి గర్వము అణగిపోయినది.

పిమ్మట ఆ మనుష్యుడు తన దారిని పోయెను. అదిమొదలు ఆ బాలుడు బుద్ధితెచ్చుకొని మంచివాడాయెను.

ఇంటివారికి అణగని బాలుని ఇతరులు అణచివేయుదురు.

M. NARAYANA ROW
*A. E. L. M. College Branch*
*Guntur*

---

# ధాన్యము



పలువిధములగు ధాన్యములు ఫలించు పైరులు వేరు వేరు దేశములందు పండుచున్నవి. వానిలో వడ్లు, చిట్టిజొన్నలు, మొక్కజొన్నలు, గోధుమలు, ఓటుధాన్యము, యవలు, రై ధాన్యము ముఖ్యములైనవి. వీని మొక్కల కన్నిటికిని కణు

వులు గలిగి బోలైన దంట్లును, సన్నముగ నుండు పొడుగైన ఆకులును, కొనలం దుండు కంకులలో గింజలును ఉండును. ఈ పైరులు గడ్డిసంబంధమైన చెట్లలో చేరినవి. వానిని తరచిచూడగా, వానిని కలుగజేసినవాడు మిక్కిలి వివేకశాలియై యుండవలె నని తోచును. వాని దంటు మరి కొంచెము తక్కువ బలముకలదై సన్నముగా ఉండినయెడల, అది గాలి విసరునకు విరిగిపోవును. అది ఎక్కువ గట్టిగాను లావుగాను ఉండిన పక్షమందు చిన్నచిన్న జంతువులును పక్షులును దానిమీదపడి కంకిలోని ధాన్యమును తినివేయును. ఆ గింజలు సూర్యుని వేడిమికి మాడిపోకుండునట్లును వర్షమునకు తడిసిపోకుండునట్లును, అవి ఊకలో దాచబడి ఉన్నవి.

ఈ విధములైన ధాన్యము లన్నియును తీపుగాను రుచిగాను ఉన్నవి. అవి మన సృష్టికర్తయొక్క దయను కనబరచుచున్నవి. ఆయన ఇట్లు మనవిషయమై కనబరచుచున్న ప్రేమను తలచుకొని మనము ఆయనను ప్రేమించి సేవింతము.

---

# తోకమాత్రము దూఱలేదు

ఒక గ్రామమునందు ఒక బాలుడు ఉండెను. వాని తండ్రి వానిని బడికి పంపెను. ఆ బాలుడు మిగుల ఆటల

యందు పరాకుగలవాడు. ఉపాధ్యాయులు చెప్పెడుదానిని వినుటలేదు. ఉపాధ్యాయులు పాఠము చెప్పునపుడు వాడు పరాకుగా చూచుచుండును.

2. ఒకదినము ఉపాధ్యాయులు వానికి పాఠము నేర్పుచుండిరి. అప్పుడు వాడు పాఠమును వినలేదు, కాని ఒక యెలుక తనబొరియలో దూరుచుండుటను చూచుచుండెను. ఉపాధ్యాయులు పాఠముచెప్పి ముగించిరి. పిమ్మట వారు, బాలునిజూచి, 'అబ్బీ' అంతయును దూరినదా? అని అడిగిరి.

3. ఆ బాలుడు వెంటనే.

పాట

దూరెనంతయు తోకమాత్రమే దూరలేదు అయ్యా,
ఓరబొరియలో తలయుమాత్రమే దూరియున్నదయ్యా.
అని చెప్పెను.

4. ఉపాధ్యాయులు వాని మాటలనువిని కడుపుబ్బనట్లు నవ్విరి. బాలుడా ఏమిచెప్పెదవు దేనితోక దూరలేదు అని యడిగిరి.

5. 'అయ్యా! అదిగో ఒక యెలుక తన బొరియలో దూరుచున్నది. దాని తలమాత్రము దూరెను. తోక ఇంకను దూరలేదు'. అనెను.

6. ఉపాధ్యాయులు.

పాట

చొప్పకాదు ఇక్కడక్కడ చూడరాదు తప్పు
చెప్పెడి పాఠమునందే బుద్ధినిచేర్చి బదులు చెప్పు.

అని మంచి బుద్ధినేర్పిరి. అదిమొదలు ఆ బాలుడు ఉపాధ్యాయులు చెప్పెడివానిని చక్కగా వినుచు గట్టివాడు ఆయెను.

M. CHENGAL ROW
*V. Class, College Branch*
*Guntur*

---

# . జము పలుకుము

ఒకయూరియందు ఒక బాలుడుండెను. వాని పేరు జేమ్సుబాబు. వాడు మంచివాడు; అబద్ధములాడడు. జరిగినది జరిగినట్లే చెప్పును. వానినందఱును మంచిబాలుడని మెచ్చుకొందురు.

2. ఒకదినము జేమ్సుబాబు బంతులాడుచుండెను. వాడు తనబంతిని ఇంటిగోడమీద ఱువ్వెను. అది యెగిరిపడునప్పుడు దానిని చేతపట్టెను. ఇట్లు ఆడుకొనుచుండగా ఆ బంతి అక్కడ తగిలించియున్న గాజుదివ్వెమీద పడెను. అప్పుడు ఆ గాజుదివ్వెతగిలి క్రిందపడి ముక్కలుముక్కలై పగిలిపోయెను.

3. జేమ్సుబాబు దానినిచూచి భయపడెను. వాని మనస్సునందు దిగులుపుట్టెను; కండ్లయందు నీరు క్రమ్మెను. అప్పుడు, వానితల్లి ఆ చోటికివచ్చెను.

4. తల్లి:—జేమ్సుబాబూ! నీ ముఖమేల వాడియున్నది? కండ్లయందు నీరేల క్రమ్మినది? నిన్నెవరైనను తిట్టిరా? లేక కొట్టిరా?

5. జేమ్సుబాబు:—అమ్మా! ఎవరును తిట్టలేదు, కొట్టలేదు, నేనొకతప్పు చేసితిని.

పాట

అమ్మా! ఏమిసేయుదు బంతులాడు చుండునపుడు
నెమ్మదిగా నుండలేకయే నే గొట్టితిగోడ

అమ్మా! నేనేమిచేయుదును, బంతి, గోడకు తగిలించియున్న గాజుదివ్వెమీద పడెను.

6. తల్లి:—నా ముద్దుల కుఱ్ఱా! గాజుదివ్వెపోయిన పోనిమ్ము నీవు జరిగినదానిని కొంచెమేనియు దాచక చెప్పితివి;

పాట

సత్యమాడితివిగా యిదియే చాల మంచిగుణము
నిత్యమిట్లులే చెప్పుచుండుమిక నెలమిగందుసుఖము.

నీవు భయపడకుము. ఇట్టి దివ్వెలన్ని పోయినను నాకు చింతలేదు నీవు నిజముచెప్పుటయే చాలును. నీవు యథార్థము

చెప్పినందులకు నీకు భక్ష్యములనిచ్చెద రమ్ము, అని పిలుచుకొనిపోయెను. పిమ్మట వానికి మంచి భక్ష్యములను ఇచ్చెను.

---

## అవివేకియైన భాగ్యవంతుడు



ఒకానొక ఐశ్వర్యవంతుని భూములు విశేషము ఫలింపగా నతడు "నేనేమి చేయుదును? నా ధాన్యము నుంచుటకు తగినంత స్థలము లేదు" అని కొంతసేపు చింతించి "నే నొక యుపాయము చేసెదను. నా కొట్టులను విప్పి వానిని పెద్దవిగా కట్టించి వానిలో నా సరకుల నన్నిటి నుంచుకొనెదను; నాకు తినుటకు అనేక సంవత్సరములవరకును సమృ

ద్ధిగా నుండును. నేను సుఖినై యుండి నాకు కావలసినంత తిని, త్రాగి యుల్లాసముగా నుండెదను” అని తనలో తా ననుకొనెను. అంతట ఆ రాత్రియే సర్వేశ్వరు డతనికి ప్రత్యక్షమై “ఓ బుద్ధిహీనుడా! నేడే నీవు దేహత్యాగము చేయవలసియున్నది. నీవు కూడబెట్టుకొన దలచిన వస్తువులను ఎవరు అనుభవింతురు?” అనెను.

మోక్షసంబంధమైన పరమధనమును సంపాదించుకొనక కొన్నాళ్లుండు ఈ లోక సుఖములందే ఆమోదించువారు ఈ మనుష్యునివలెనే అవివేకులు. కుబేరునివలె ధనికుడైన ఈ మనుష్యుడు సజీవుడై యుండిన కాలమందు దేవుని మరచిపోయి యుండినందున, వాడు మోక్షభాగ్యమును పోగొట్టుకొని శాశ్వత దుఃఖమును పొందును.

“ఏ మనుష్యుడైనను లోకమునంతను సంపాదించుకొని పరమభాగ్యమును పోగొట్టుకొనిన పక్షమున అతని కేమి సుఖముండును?” అని యేసుప్రభు వడుగుచున్నాడు. శీఘ్రముననే మనము చనిపోవలసిన కాలము వచ్చును. అప్పటికి ఈ లోకసుఖమును విడిచిపెట్టి పోవలసియుండును. మనము ఈ లోకమున కేమియు తీసికొని రాలేదు; దీనిలోనుండి యేమియు మనవెంట తీసికొని పోజాలము. కనుక పరలోక నివాసులకు తగిన నడవడి గలవారము అగుటకై మనము

ప్రయత్నము చేయుట యుక్తము. కాబట్టి మన శక్తివంచన లేకుండునట్లు మనము సత్కార్యములను చేయుటకు దేవుని ఆజ్ఞల ననుసరించి నడుచుకొనుట మనకు ఎంతో అవశ్యము.

---

## పుత్రునివలన బుద్ధివచ్చుట

ఒక గ్రామమునందు కాపువాడు ఒకడు ఉండెను. వానికి పెక్కు పొలములు గలవు. వాని తండ్రి మిక్కిలి వృద్ధుడు; అప్పుడు అతనికి సుమారు ఎనుబదియేండ్ల వయస్సు ఉండును.

2. కాపువాడు తన తండ్రిని ఇంటి అరుగుపై పడి ఉండుము అనెను. పాపము, ముసలివాడు తన కొడుకు మాటను మీఱక నడచుకొనెను.

3. కాపువాడు తన తండ్రి చేతికొక చట్టినిచ్చి దాని యందు గంజి పోయుచుండెను. పాపము ముసలివా డేమిచేయును; దానిని వద్దు అని చెప్పలేక త్రాగు చుండెను.

4. కాపువానికి ఒక కొడుకు గలడు. వానికి పది యేండ్ల వయస్సువాడు ఒకదినము తాతయొద్దకు పోయెను.

అతని ప్రక్కనున్న చట్టిని చూచెను; దానిని ముసలి వానికి తెలియనట్లు తీసి దాచియుంచెను.

5. పిమ్మట కాపువాడు తన తండ్రికి గంజి పోయుటకు వచ్చి తండ్రినిచూచి చట్టిని పట్టుము అనెను. ముసలి వాడు తనచుట్టును తడివిచూచెను. చట్టి కనబడలేదు. అయ్యో పాపము! ముసలివానికి దిగులు పుట్టెను; భయముచేత చేతులు వణకెను.

6. అప్పుడు కాపువాడు, చట్టి ఎక్కడ? చట్టి ఎక్కడి కైనను స్వారిపోయినదా? అని తిట్టెను. మఱియు తలమీదను కొట్టెను. వెంటనే కాపువానికొడుకు పరు గెత్తికొనివచ్చి,

పాట

అయ్యో తాతను తిట్టకుడు
అయ్యో తలపైకొట్టకుడు
తండ్రి:—చట్టి మఱొక్కటి కొనవలెరా?
కట్టడమీరగ దగునటరా?
కొడుకు:—ఘనమనిదాచితినే వినుడు
కొనవద్దిదిగో కనుగొనుడు
తండ్రి:—ఏలరదానిని దాచితివి
చాలగకోపము పెంచితివి

కొడుకు :—నాయన మీకగునని యెంచి
ఈ యది దాచితి నేమించి.

అని చెప్పెను.

7. కాపువాడు తన కొడుకు చెప్పిన మాటలవలన మంచి బుద్ధిని వహించెను. వాడు అది మొదలుకొని తన తండ్రి యెడల ప్రీతిగలిగి నడచుకొనెను.

పిల్లలారా! మీ తలిదండ్రులను సన్మానించండి.

---

# బాలమిత్ర టపా

ప్రియబాలమిత్రులారా!

నేను మీకు కొన్ని సంతోషకరమైన వర్తమానములను తెలియజేయవలెనని తలంచియున్నాను. నేను ప్రతినెల బాలమిత్ర చదువునప్పుడెల్ల నా మనస్సు ఎంతో ఉల్లాసకరముగానుండి మా హిందూ క్యాస్ట్ గర్ల్‌స్కూల్ విషయమై వ్రాయవలెనని ఉద్దేశించితిని. నేను నెల్లూరులో ట్రెయినింగ్ చదివి జయమొందిన తరువాత బాపట్లలోని ఎ. ఇ. ఎల్. ఎమ్ క్యాస్ట్ గర్ల్‌స్కూలులో పనిచేయుచుంటిని మా బడిలో 150 మంది బాలికలున్నారు. వీరు బైబిలునందు ఎక్కువ ఆశ




గలవారై ఉన్నారు. మేము మా బడిప్రార్థనలో మొదట పువ్వులగంప అను పుస్తకమును చదివి వినిపించితిమి. దాని వలన చాలమట్టుకు వారు మేలును పొందినారు. అటుపిమ్మట యాత్రికుని ప్రయాణము అను పుస్తకమును ఆరంభించితిమి. దానిని చక్కగావిని చాల భయభక్తితో మెలగుచున్నారు. ఈ హిందూబాలికలు క్రైస్తవపాటలు బహు ఉల్లాసకరముగా పాడుదురు. అనేకమైన బైబిలు వాక్యములు మత్తయి, మార్కు, లూకా, యోహాను, ఆదికాండము ఇంకా అనేకమైన బైబిలు సంబంధమైన పుస్తకములను చక్కగా చదువగలరు. ప్రతి ఆదివారము సబ్బాతు బడికి బహు క్రమముగా

వచ్చువారు. వారు చందాలనుకూడ తీసికొని వచ్చెదువారు. ఈ హిందూబాలికలు మేము చెప్పు దైవవాక్యములనువిని వారిఇంట్లో ఎవ్వరైనను జబ్బుపడినయెడల దేవునికి కానుకలను, ఒప్పుకొందురు. మరియు వారి పరీక్షలలో జయమొందినను చందాలను ఒప్పుకొందురు. ఈ విధముగా ఒక బాలిక తన పెనిమిటికి జబ్బుగా నున్నందున ఆ బాలిక ప్రభువైన యేసు క్రీస్తునందు విశ్వాసముంచి ప్రార్థించగా తన పెనిమిటి స్వస్థత నొందెను. దానికిగాను దేవునికి 2 రూ. కానుకగా నర్పించెను. ఇంకా అనేకమంది అనేకసార్లు ఈ విధముగా కానుకలను ఒప్పుకొని దేవునికి అర్పించిరి. కాబట్టి ఈ హిందూబాలికలు దేవునియందు భక్తివిశ్వాసములు గలవారని ఎక్కువగా తలంచుచున్నారు.

మరియు మా హెడ్మాస్టరుగారు కడుప్రయాసముతో ఈ బాలికలను ఇంకా ఎక్కువగా చేయుచున్నారు. మా మిశమ్మగారు ఈ బాలికలకు అప్పుడప్పుడు బహుమానముగా క్రీస్తుపటముల నొసంగుచున్నారు. ఈ బడివిషయము మేము ఎక్కువగా దేవునికి కృతజ్ఞత చెల్లించుచున్నారము. ఇంకా మాబడి ఆత్మీయాభివృద్ధియందు సంఖ్యయు వృద్ధియగునట్లు మీరెల్ల ప్రార్థించవలెనని వినయ వందనములతో అడుగుచున్నాను.

దేవుడు మా హిందూబడిని ఆశీర్వదించునుగాక ఆమేన్.

ప్రియతల్లిగారూ! నేను ఈ బాలమిత్రను వేయవలయునని చాల దినములనుండి తలంచితినిగాని నాకు ఇప్పటికి తరుణము దొరికెను, గాన నాయందు దయయుంచి ఈ సంగతులను తప్పులున్న సవరించి బాలమిత్ర టపాలో వేయించవలెనని వినయవందనముతో బ్రతిమాలుచున్నాను. మరియు మెకాలి అమ్మగారు నెల్లూరులో నున్నప్పుడు నన్ను దీనివిషయమై హెచ్చరించిరి. అప్పటినుండి నేను దేనివిషయమై వేయవలయునో తెలియక పూరకొంటిని, గాన ఇప్పుడు నా మనస్సు ఉల్లాసముతో దీనిని లిఖించుచున్నాను. దయయుంచి వేయించండి, దేవుడు మిమ్ములను అన్ని విషయముల ఆశీర్వదించును గాక, మీరు చిరకాలము ఆయురారోగ్యవంతులై యుందురు గాక ఆమేన్.

ఇట్లు

మీ ప్రియ బాలమిత్రురాలు

కే. గ్రేసమ్మ

ఏ. ఇ. ఎల్. ఎమ్ క్యాస్ట్‌గర్ల్సుస్కూల్

బాపట్ల

C. L. S. PRESS, MADRAS—1919